శ్రీమతేరామానుజాయనమః.

# భగవద్విషయప్రచురణపత్రిక.

భగవద్విషయకమిటిమెంబర్లు.

శ్రీమాన్, కొత్తాయతిరాజులుసెట్టిగారు, మోసస్ కంపెని.
,, కరాలపాటి ఆళ్వారయ్యగారు, క - ఆళవందారయ్య అండు సన్.
,, పబ్బిసెట్టి రామస్వామి సెట్టిగారు, పి - రంగయ్యసెట్టి అండు సన్సు.
,, ముక్కాల వెంకటకన్నయ్యసెట్టిగారు, షాపుకీపర్.

భగవద్విషయము ౧౦ పత్తులక్రయము రు ౫౦.

ఏకకాలమునందు ౧౦ ప్రతులుకొనువారికి నొకప్రతిపారితోషికముగ నివ్వంపఁబడును.

శ్రీవైష్ణవగ్రన్థముద్రాపకసభ (లిమిటెడ్) కు చందాబాకీలేనిచందాదారుఁడు ౧౯౦౩-౪-వ సంవత్సరము సెప్టంబరు నెల ౩౦-వ తేది లోపల మొదటిపత్తుక్రయము రూ. ౭ ను ఒకదఫాగాగాని రెండుదఫాలుగాగాని చెల్లించినయెడల అట్టి చందాదారునికిమాత్రము వానికివ్వవలసిన యీ మొదటిపత్తు యిచ్చుటయేగాక పదిపత్తులను సంపూర్ణముగ ముద్రింప యత్నించియుండెడి యీభగవద్విషయకమిటిచే ముద్రింపఁబడు పైపత్తులన్నియు సభాభివృద్ధికొఱకు అచ్చుగువఱకు బయిండులేక నిసాముగా నివ్వంపఁబడును.

ఇట్లు ఒక చందాదారునికి నొక ప్రతిమాత్రమే యివ్వంపఁబడునుగాని యధికమివ్వంపఁబడదు. రెండవ ప్రతికావలసియున్నయెడల పూరా క్రయమిచ్చియే కొనవలయును.

పైనుదహరించినట్లు ౧౯౦౩-౪-వ సం॥ సెప్టంబరు నెల ౩౦-వ తేదిలోపల సభ చందాదారుఁడు ఈ మొదటిపత్తుకు రూ. ౭ లు చెల్లించనియెడల అక్టోబరుమాసము మొదలు నెల ౧-కి రూ. ౦-౨-౦ చొప్పున క్రయముతోఁజేర్చి చెల్లించవలయును.

శోభకృతు నామ సం॥ ఆని నెల ౧-వ తేది.

కరాలపాటి - ఆళ్వారయ్య.
భగవద్విషయకమిటిమానేజరు,
నెం. ౩౧ నం. అయ్యాపిళ్ళ వీధి యనే వెంకటాచలమొదలివీధి.
చెన్నపట్టణము

## ముతల్ప్పత్తిల్ తిరువాయ్మొఴి నూఱ్ఱన్దాది పాశురఙ్గళినట్టవణై.

| పాశురఙ్గళ్. | పాశుర సంఖ్యై. | పుటసంఖ్యై. | పాశురఙ్గళ్. | పాశుర సంఖ్యై. | పుటసంఖ్యై. |
|---|---|---|---|---|---|
| ౧ అఙ్ఞిత్రైయపుట్కుడమై | ౭ | ౩౬౯ | ౬ పరివతిలీశనై | ౬ | ౪౩౫ |
| ౨ ఇవ్వైయతిన్ద్రోర్తమ్మళవిల్ | ౯ | ౫౧౮ | ౭ పిఱవియఱ్ఱు | ౭ | ౪౬౬ |
| ౩ ఉయర్వేపరన్పడియై | ౧ | ౧౯౬ | ౮ పొరుమాల్ | ౧౦ | ౫౪౭ |
| ౪ ఓడుమనమ్ | ౮ | ౪౮౮ | ౯ వళిమిక్క | ౫ | ౪౧౯ |
| ౫ పత్తుడైయోర్క్కు | ౩ | ౩౧౮ | ౧౦ వీడుశెయ్యగు | ౨ | ౨౩౭ |

## ద్రమిడోపనిషత్సఙ్గతియిల్ ఉపోద్ఘాత శ్లోకఙ్గళినట్టవణై.

| శ్లోకఙ్గళ్. | శ్లోకసం. | పుటసంఖ్యై. | శ్లోకఙ్గళ్. | శ్లోకసం. | పుటసంఖ్యై. |
|---|---|---|---|---|---|
| ౧ ఆచార్యోజ్జితపద్ధత్యా | ౨ | ౧౯౦ | ౮ మాతాపిత్రుప్రభృతిః | ౮ | ౧౯౨ |
| ౨ అద్యైవయస్యపి | ౪ | ౧౯౧ | ౯ యశ్చకార | ౧ | ౧౯౦ |
| ౩ ఇత్థంహరేః | ౭ | ౧౯౨ | ౧౦ యశ్చైతస్యైవ | ౧౨ | ౧౯౩ |
| ౪ కైఙ్కర్యమస్య | ౧౬ | ౧౯౪ | ౧౧ యాప్రీతిరస్తి | ౧౧ | ౧౯౩ |
| ౫ తన్త్రార్థేయత్ | ౧౩ | ౧౯౪ | ౧౨ యేనాఘువే | ౫ | ౧౯౧ |
| ౬ పుంస్త్వంనియమ్య | ౧౦ | ౧౯౩ | ౧౩ శబ్దస్యసంస్కృతతయా | ౯ | ౧౯౨ |
| ౭ ప్రహ్లాదనారదముఖ | ౬ | ౧౯౧ | ౧౪ శ్రీమాన్గుణామ్బుధిః | ౩ | ౧౯౦ |

## ముతల్ప్పత్తిల్ ద్రమిడోపనిషత్సఙ్గతి శ్లోకఙ్గళినట్టవణై.

| శ్లోకఙ్గళ్. | శ్లోకసం | పుటసంఖ్యై. | శ్లోకఙ్గళ్. | శ్లోకసం. | పుటసంఖ్యై. |
|---|---|---|---|---|---|
| ౧ అత్రాజ్ఞేష్వానుభవ | ౯ | ౫౧౭ | ౬ దాస్యేషు | ౬ | ౪౩౪ |
| ౨ ఇత్థంశ్రియఃపతిత్వ్రత | ౧౦ | ౫౪౫౦ | ౭ దూరస్థమపి | ౩ | ౩౧౬ |
| ౩ కౌటిల్యవత్సు | ౮ | ౪౮౬ | ౮ పుంసశ్శ్రియఃప్రణయినః | ౭ | ౪౬౫ |
| ౪ తత్రాదిహేతు | ౧ | ౧౮౯ | ౯ సంసారిణోపి | ౨ | ౨౩౬ |
| ౫ తత్కాశక్తిశానధిగమేన | ౪ | ౩౬౬ | ౧౦ స్వాలిఙ్గవాది | ౫ | ౪౦౮ |

## ద్రమిడోపనిషత్తాత్పర్యరత్నావళియిల్ తిరువాయ్మొழியి నవకారికా శ్లోకఙ్గళినట్టవణై.

| శ్లోకఙ్గళ్. | శ్లోకసం | పుటసంఖ్యై. | శ్లోకఙ్గళ్. | శ్లోకసం. | పుటసంఖ్యై. |
|---|---|---|---|---|---|
| ౧ ఆదౌశారీరకాణ్ణ | ౫ | ౧౧౭ | ౬ ప్రాచ్యేసేవానుగుణ్యాత్ | ౬ | ౧౧౨ |
| ౨ ఇచ్ఛాపారర్థ్య | ౧౦ | ౧౨౧ | ౭ బ్రూతేగాథాసహస్రమ్ | ౯ | ౧౨౦ |
| ౩ దేవక్ళ్రిమ్మణ | ౭ | ౧౧౨ | ౮ భాషాగీతిః | ౪ | ౧౧౬ |
| ౪ సాక్ష్యాలీగాత్ర | ౩ | ౧౧౬ | ౯ సారస్సారస్వతావాడ | ౧ | ౧౧౪ |
| ౫ ప్రజ్ఞాక్యై | ౨ | ౧౧౫ | ౧౦ సేవ్యత్వాత్ | ౮ | ౧౧౯ |

## ముతల్పత్తిల్ ద్రమిడోపనిషత్తాత్పర్య రత్నావళిశ్లోకఙ్గళినట్టవణై.

| శ్లోకఙ్గళ్. | శ్లోకసంఖ్యై | పుటసంఖ్యై. | శ్లోకఙ్గళ్. | శ్లోకసంఖ్యై | పుటసంఖ్యై. |
|---|---|---|---|---|---|
| ౧ అక్రీతైరర్చ్యభావాత్ | ౭ | ౪౩౫ | ౭ బద్ధాపాఙ్గత్వాత్ | ౩ | ౩౧౭ |
| ౨ ఆదావిత్థంపరత్వాత్ | ౧౨ | ౫౪౭ | ౮ విష్వగ్విస్రస్తనిద్రత్వమ్ | ౧౧ | ౫౪౬ |
| ౩ శ్రుద్రావ్యావాభిముఖ్యాత్ | ౬ | ౪౨౦ | ౯ సక్రీడవాక్య | ౫ | ౩౬౭ |
| ౪ ప్రాణేబద్ధధ్వజత్వాత్ | ౪ | ౩౬౬ | ౧౦ సచ్చిత్రాకర్ష హేతోః | ౮ | ౪౬౫ |
| ౫ నిస్సీమోద్యద్గుణత్వాత్ | ౧ | ౧౯౫ | ౧౧ సూరీణాంస్వైరసేవ్యే | ౯ | ౪౮౭ |
| ౬ పర్యస్తైశ్చోచదృష్టమ్ | ౧౦ | ౫౧౭ | ౧౨ స్వామిత్వాత్ | ౨ | ౨౩౬ |

శ్రీః.





మధురకవులు. నమ్మాళ్వార్లు. నాథమునులు.



శ్రీమతే రామానుజాయ నమః.

# నమ్మాళ్వార్ల ప్రభావ సంగ్రహము.

శ్రీమదఖండమండల మండనాయమాన భరతఖండమునందు గంగాది మహానదులకంటె శ్రేష్ఠమైన తామ్రపర్ణీనది యొక్క తీరమున కురుకూరనియెడి దివ్యక్షేత్రమొకటికలదు.

ఈనగరము కౌరవమహారాజుచే ద్వాపరయుగమునందుఁ బరిపాలింపఁబడెను. అచ్చటఁ జతుర్థకులమునందు విభూతినాథేంద్రులనియెడి భాగవతోత్తములొకరుండిరి. వారికిధర్మధరులను కొమారులుపుట్టిరి. వారికిచక్రపాణి యనియెడితనూభవులుద్భవించిరి. వారికచ్యుతులనునాత్మజులవతరించిరి. వారికి సుమతియనియెడి సుతులుజనించిరి. వారికి శెన్దామరైక్కణ్ణననియెడి కొమరులుపుట్టిరి. వారికి కారియనియెడి కుమారులు కలిగిరి. వారుసకలగుణసంపన్నులుగాను విశేషభగవద్భక్తికలవారుగాను నుండిరి. వారు ఉడైయనఙ్గైయమ్మగారనియెడి నాథనాయకియమ్మగారిని వివాహమాడిరి. వారుకొంతకాలము బిడ్డలేకయుండి తిరుక్కుఱుఙ్గుడినమ్బినిఁ బ్రార్థించివారియనుగ్రహమును బడసిరి. వారికిఁగలియుగముపుట్టిన (౪౩)వ దినమగుఁ బ్రమాదిసంవత్సరము వైయాశి నెల ౧౨-వ తేది వైశాఖ శుక్లచతుర్దశీ శుక్రవారమునఁ గటకలగ్నమున దివ్యతేజస్సుతో వెలుఁగుచున్న నమ్మాళ్వార్లవతరించిరి.

వీరు లోకులబిడ్డలవలె స్తన్యపానాదులను జేయక యేడ్వక కనులను మూసికొని తిరువవతారము మొదలు భగవద్ధ్యానైకపరులై యుండిరి. ఇదియేమివిచిత్రమని తల్లిదండ్రులు వితర్కించి పండ్రెండవదివసమున పొలిన్దునిన్ఱపిరాను సన్నిధికిఁ దీసికొనిపోయి సేవింపఁజేయఁ దక్షణంబె కనులు నెఱచి జరిగిజరిగి, శేషాంశమున నవతరించియుండు తిరుప్పుళియాళ్వార్లనియెడి తింత్రిణీవృక్షముక్రిందికి వేంచేసి పద్మాసనంబిడి యోగనిష్ఠాగరిష్ఠులైరి. వీరిస్వభావమిట్లు భగవద్దర్శనమాత్రముచే మారెనుగాన వీరికదిమొదలు "మాఱన్" అనుతిరునామము విలసిల్లెను. పిమ్మటవీరునిరాహారులై యుండియు భగవద్ధ్యానమహిమచే శుక్లపక్షచంద్రునిపగిది దినదినమువర్ధిల్లుచు ౧౬-సంవత్సరములు జ్ఞానముద్రతో మౌనంబవలంబించి యుండిరి.

ఇట్లుండ, దివ్యదేశయాత్రసలుపుచున్న మధురకవియాళ్వార్లు బదరికాశ్రమమునుండి అయోధ్యకేతెంచి కొన్నిదివసములక్కడనుండిరి. ఒకనాఁడు జలస్పర్శనిమిత్తమర్ధరాత్రమందు బయలువెడలిచూడ దక్షిణదిక్కునం దొకగొప్పవెలుఁగగపడెను. ఇదియేమని చింతించి దానినిగుఱిబెట్టుకొని దక్షిణమునకు రానురాను ఆళ్వారుతిరు

నగ్నిజ్వాలకుఁ గనఁబడి పిమ్మటఁ గనఁబడకపోయెను. ఇట్టిదివ్యతేజస్సుగలవారెవరిక్కడనున్నారని విచారించి యీయాళ్వార్లసన్నిధానమునకుఁజేరి ముకుళితహస్తులై చిరకాలము నిరీక్షించియువారుకనులు దెఱచి చూడనందున నొకపెద్దఱాతినెత్తి క్రిందఁబడవేసిరి. ఆధ్వనివిని యాళ్వార్లుకండ్లుదెఱచి చూచిరి. వీరిమహిమను దెలిసికొనఁగోరి "స్వామీ! ప్రకృతిగర్భమునందు జీవుఁడు పుట్టినయెడల దేనినిదినియెక్కడనుండును" అనిభావగర్భముగఁబ్రశ్నచేసిరి. "దానినేతినియక్కడనేయుండు" ననిబదులుసాదింపఁ బరమప్రీతులై వీరు సర్వజ్ఞులని విశేష ప్రతిపత్తిఁజేసి నిత్యసేవఁ జేయుచుండిరి.

వీరులోకయాత్రబొత్తిగావదలి ౧ "ఉణ్ణుమ్‌శోఱుపరుకునీర్‌తిన్నుమ్ వెత్తిలైయుమెల్లామ్‌కణ్ణన్" అనునట్లుసమస్తభోగ్యభోగోపకరణములును ధారకపోషకములును భగవన్నామములనేచేసికొని తదేకపరులై యుండుటఁజూచి ఆయాదివ్యదేశమెమ్బెరుమాన్లు తింత్రిణీమూలముననే సేవసాదింప మఙ్గళాశాసనముఁ జేయుచు పరభక్తిపరజ్ఞానపరమభక్తులు తలయెత్తియనుభవపరీవాహరూపముగ ౧౦౦ - పాశురములుగల తిరువిరుత్తమును, ౭ - పాశురములుగల తిరువాశిరియమును, ౮౭ - పాశురములుగల పెరియతిరువన్దాదిని, ౧౧౦౨ - పాశురములుగల యీతిరువాయ్మొళిని సాదించి మధురకవులకనుగ్రహించిరి.

ఈనాల్గుదివ్యప్రబన్ధములు ఋగ్యజుస్సామాథర్వణవేదముల సారాంశములైయున్నవిగనుకవీరికి(౧) "వేదమ్ తమిళ్‌శెయ్‌దమాఱన్" అనితిరునామము ప్రసిద్ధమాయెను. వీరు, అజ్ఞానమును గలుగఁజేయు శఠవాయువును కోపించినందున వీరికి (౨)శఠకోపులనియు, పగడ పుష్పములను నాభరణముగాఁగలవారుగనుక (౩)వకుళాభరణులనియు, ప్రపన్నులందఱును మనయాళ్వార్లని యంగీకరించుటవలన (౪) నమ్మాళ్వార్లనియు తిరునామంబులనుబొందిరి.

వీరికి నామాన్తరములు—(౫) కారిమాఱులు, (౬) కారిసూనులు, (౭) మాఱశఠకోపులు, (౮) పరాఙ్కుశులు, (౯) వేదమ్‌తమిళ్‌శెయ్‌దపెరుమాళ్, (౧౦) తిరువాయ్‌మొళిప్పెరుమాళ్, (౧౧) ఉదయభాస్కరులు, (౧౨) తిరునావీఱుడైయపిరాన్, (౧౩) కురుకేశులు, (౧౪) కురుకాధిపతులు, (౧౫) కురుకైప్పిరాన్, (౧౬) తిరుక్కురుకూర్‌నమ్బి, (౧౭) తెన్నరఙ్గన్‌పొన్నడి, (౧౮) వకుళభూషణులు, (౧౯) తిరువరఙ్గన్‌పొన్నడి, (౨౦) అరుళ్‌మాఱన్. వీరుప్రపన్నజనకూటస్థులు, వీరుఅవయవి. తక్కిన యాళ్వారాచార్యులు అవయవభూతులు. అదియెట్లన్న - వీరికి తిరుముడిస్థానము నంబెరుమాళ్, వీరిశ్రీహస్తములు భుజములు తిరుమేనును బదుగురాళ్వార్లు, వీరిపదములు తొడలు శ్రీమన్నాథయామునవాదులు, వీరితిరువడిశఠరి యన దర్శనస్థాపకులైనయతిరాజులువారు. వీరితిరువారాధనము పొలిన్దునిన్ఱపిరాన్. వీరియాచార్యులు సేనైముతలి యాళ్వార్లు. వీరిశిష్యులు మధురకవియాళ్వార్లు, శ్రీమన్నాథమునులు మొదలగువారు. వీరు ఆచార్యకోటిలోను వేంచేసియున్నారు.

ఇట్టి పరమవైభవముగల యాళ్వార్లకు ౩౫-వ సంవత్సరములోనే యవతారకార్యముముగిసెనుగాన వీరిని పరమపదనాథుఁడు పరివారసహితముగ వరుగులిడివచ్చి పరమపదమునకు వేంచేపుచేసికొనివెళ్ళెను. అర్చిరాదిమార్గమున నడుగడుగునకు ననేకములైన సత్కారములను స్వీకరించుచు దేవదుందుభివాద్యములుమ్రోయ నప్సరసలాడ బహువైభవముగ వేంచేసిరి. ఈసంగతి ముందుగనే మధురకవులు మొదఁగువారికిఁ దెలిపి ప్రకృతియారికి పయనమగునట్లు వెళ్ళిరి.

# నమ్మాళ్వార్ల ప్రభావసంగ్రహము.

పిమ్మట మధురకవులు నమ్మాళ్వార్ల దివ్యవైభవమును "కణ్ణినుణ్ శిఱుత్తాంబు" అను గ్రంథముచే బయలుపఱచి తిరునగరియందు నమ్మాళ్వార్ల నర్చావతారమున వేంచేపుచేసి గోపురమండప ప్రాకారాదులు నిర్మించి సంప్రోక్షణజరిగించి నిత్యోత్సవ మాసోత్సవ వర్షోత్సవాదుల నతివిభవముగ జరుపుచుండిరి.

పిమ్మట, వీరి దివ్యప్రబన్ధములు సమస్తలక్షణములతోనొప్పి సర్వోత్కృష్టములుగానున్నవని విచక్షణులందఱును విశ్వసించుచుండ నప్పుడుండు ద్రావిడపండితులు కొందఱసహమానులై "ఱువియే పాటి" వనినుడువ నారాజు పరీక్షార్థము నమ్మాళ్వార్లుపాడిచిన దివ్యప్రబంధములలో నొకపాశురమును నతనిసభయందుండు పరీక్షాఫలకమైన శంఖప్పలకైమీద వ్రాయించెను. అంతట నాపరీక్షాపీఠమక్కాలంబున సుప్రసిద్ధులైన కంబుఁడు మొదలగు మున్నూఱుగురరవపండితుల కవిత్వములను క్రిందఁద్రోసి నమ్మాళ్వార్ల పాశురమునుమాత్రము శిరసావహించెను. అంతట ద్రవిడవిద్వాంసులందఱు నచ్చెరువొంది యాళ్వార్లయందు మిక్కిలి భక్తిఁజేసి వారివిషయముగ ననేకకవనములఁ జెప్పి కృతార్థులైరి.

పిమ్మట మూఁడువేల సంవత్సరములకువెనుక శ్రీమన్నాథమునులు కణ్ణినుణ్ శిఱుత్తాంబు లక్షనూర్లత్యాదరముతో సేవింప నమ్మాళ్వార్లు వారికిఁ బ్రత్యక్షమై ప్రసాదితములైన నాలాయిరదివ్యప్రబంధములను పాడించిరి. వీరాళ్వార్లలో నెట్లుముఖ్యులో, అట్లే వీరొసఁగిచ్చిన దివ్యప్రబంధంబులు నాళ్వారాచార్యులొసఁగిన శ్రీసూక్తులన్నిఁటిలోను ముఖ్యములైనవి. వీరిప్రబన్ధములు అంగి, తక్కినవన్నియు అంగములు.

శ్రియఃపతియై శ్రీవైకుణ్ఠనికేతనుఁడైన సర్వేశ్వరుఁడు అవాప్తసమస్తకాముఁడును నిత్యముక్తానుభావ్యుఁడునైనను లీలావిభూతియందుండు చేతనులు జననమరణాది సంసారచక్రమునందుఁ దగిలికొని దుఃఖమునొందుటఁజూచి వీరి యుజ్జీవనముకొఱకు పరమదయాళువై శ్రుతిస్మృతీతిహాసపురాణములు కృపఁజేసియు, తానుమత్స్యకూర్మాద్యనేకావతారములెత్తియు కార్యకరముకానందున సజాతీయునిగొని చేతనులను వశపఱుచుకొనఁగోరి, తనస్వాతన్త్ర్యకార్యముగ నాళ్వార్లను నిర్హేతుక జాయమాన కటాక్షపాత్రులనుగఁజేసి వారికి పరావరతత్వ యాథాత్మ్యజ్ఞానముకలుగునట్లు కృపఁజేసెను. వీరు దివ్యజ్ఞానముచేత ౧ "కలియుమ్ కెడుమ్ కణ్డుకొణ్మిన్" అని కరకాల యతివరాదుల తిరువవతారమును సూచనచేసినట్లు, ౨ "కృతాదిషు ప్రజా రాజన్ కలావిచ్ఛన్తి సంభవమ్ । కలౌ ఖలు భవిష్యన్తి నారాయణపరాయణాః । క్వచిత్ క్వచిన్మహాభాగ ద్రావిడేషు చ భూరిశః । తామ్రపర్ణీనదీయత్ర కృతమాలా పయస్వినీ" అనియు ౩ "క్రూరే కలియుగే ప్రాప్తే నాస్తికైః కలుషీకృతే । విష్ణోరంశాంశసంభూతో వేదవేదార్థతత్వవిత్ । స్తోత్రం వేదమయం కర్తుం ద్రావిడ్యాపి చ భాషయా । జనిష్యతి సతాం శ్రేష్ఠో లోకానాం హితకామ్యయా" అనియు తామ్రపర్ణీనదీతీరమునందుఁ గలియుగంబున సర్వశాస్త్రవిత్తులైన యాళ్వార్లవతరించి ద్రవిడప్రబంధములను పాడింపఁబోయెదరని పురాణములందు సూచింపఁబడియె.

వీరివాచామగోచరమైన విభవంబుజూఁడ వీరిని విశేషమైనవిజ్ఞానముగల విబుధులు వివిధవిధములుగ వితర్కించుచున్నారు. పరాత్పరుఁడైన శ్రీమన్నారాయణుఁడు కృతయుగంబున బ్రాహ్మణోత్తముఁడైన జమదగ్నిగర్భంబునఁ బరశురాముఁడుగాను, త్రేతాయుగంబున క్షత్రియపుంగవుఁడైన దశరథచక్రవర్తికి శ్రీరాముఁడుగాను, ద్వాపరయుగంబునఁ బట్టాభిషేకప్రాప్తిలేక వైశ్యప్రాయుఁడైన వసుదేవునికిని సాక్షాద్వైశ్యుఁడైననన్దునికిని కొమారుఁడైన శ్రీకృష్ణుఁడుగాను నెట్లు అవతరించెనో యట్లే కలియుగంబునను కారికొమరుఁడై కారిమాఱనను నామధేయమ్మున నవతరించెనేమోయని కొందఱు శంకించుచున్నారు. లేక సంస్కృతవేదమును విభాగపఱచి ప్రవచనము చేయుటకు విష్ణువు వ్యాసులయందు నావేశించినట్లు ద్రవిడవేదములను బ్రవర్తింపఁజేయుటకు నాళ్వార్ల

౧. తిరువాయ్-౪-౨-౧. ౨ భా-౧౧. ౩ భా-౧౧.

యుండుటను నావేశించెనేమో? యని మఱికొందఱు సందియంబు నొందుచున్నారు. ౧ "సేనేశో౽వతరిష్యతి" అనునట్లు సేనాంశమం దవతరించిరని కొందఱూహించుచున్నారు. ౨ "మూతువర్ కరైకణ్డోర్ శీరియరిలే యొరువరో?" అనునట్లు సర్వేశ్వరుని నియమనానుసారంబున లోకోజ్జీవనార్థముగ నవతరించిన నిత్యసూరులలో నొకరుగానుందురేమో? యని యింక కొందఱు సందేహమునొందుచున్నారు. లేక 3 "కరైకణ్డోర్" అనునట్లు సంసారమునందు గట్టునెక్కి సంసారుల మర్మమెల్ల నెఱింగినవారుగాన సంసారులనుద్ధరించుటకు వీరేతగుదురని భగవంతుఁడు నియమింప లీలావిభూతియందు లోకోజ్జీవిష్ణులై యవతరించిన ముక్తులలో నొకరుగానుందురా? యని గుండెతో సందియంబొందుచున్నారు. ౪ "పాఱ్కడల్ పామ్బణైమేల్ పళ్ళికొణ్డరుళుమ్ శీలనై యేత్తు వార్ విణ్ణులారిలుమ్ శీరియర్" అనునట్లు క్షీరాబ్ధినాథుని సేవించుచుండెడి శ్వేతద్వీపవాసులలో నొకరి యవతారముగానుందురేమోయని కొందఱు తలఁచుచున్నారు. ౫ "మున్నమ్ నోఱ్ఱ విదియుఙ్గళ్ మేల్ పుణ్ణియఙ్గళ్ ఫలిత్తవరో?" అనునట్లు జన్మాంతరసహస్ర సంచిత సకలసుకృతఫలముగ బద్ధులలో నొకరవతరించిరో? యని కొందఱు యోచించుచున్నారు గాని భగవన్నిర్హేతుక జాయమాన దివ్యకటాక్షపరివాహపూరిత జ్ఞానవైరాగ్యభక్తియుక్త బద్ధసంసారులనియే ప్రసిద్ధమైన సిద్ధాంతము.

కర్మజ్ఞానసాధ్యమై భగవత్ప్రాప్తికి సాధనమైన యుపాసకుల భక్తికంటెను, సర్వేశ్వరునియాచించికైంకర్యార్థము ప్రపన్నులుపొందెడు భక్తికంటెను వీరిభక్తి విలక్షణమైనదిగానున్నది. ౬ "బాల్యాత్ప్రభృతిసుస్నిగ్ధః" అనునట్లు వీరిభక్తి సహజమై భగవద్విశ్లేషమునందు దూఁగలరుబంపునట్లును, మడలెత్తునట్లును, హద్దుమీరి సర్వోత్కృష్టమై వెలుఁగుచున్నది. ఇది నిర్హేతుకమని వారివచనములచేతనే యేర్పడుచున్నది. ౭ "ఇదకిలేన్" ఎవరికిని నేమియుఁబెట్టియెఱుఁగను. ౮ "నోఱ్ఱనోన్బిలేన్ నుణ్ణఱివిలేన్" నోములునోచి కర్మయోగమున నుష్ఠింపనైతిని, సూక్ష్మమైన జ్ఞానమును సంపాదించి జ్ఞానయోగము ననుష్ఠించినవాఁడనుగాకపోతిని, తదుభయసిద్ధమైన భక్తియోగములేనివాఁడననుట అర్థాత్సిద్ధమే. ౯ "కిట్పన్ కిల్లేన్ ఎన్ఱిలన్ మున్నాళాల్" పూర్వజన్మములందు విహితానుష్ఠానముఁజేయనైతిని; నిషిద్ధానుష్ఠానము వదలనైతిని. ౧౦ "కుఱిక్కొళ్ జ్ఞానఙ్గళాలెనై యూళి శెయ్ తవముమ్ కిఱిక్కొణ్డిప్పిఱప్పే శిలనాళిలెయ్ దినన్ యాన్" యమనియమాదులచేత సంపాదింపఁదగిన వేదనధ్యానోపాసనాది జ్ఞానములచేత గుణాతిశయములు శ్రవణముజేసి మననముజేసి ధ్రువానుస్మృతిజేసి లభింపఁదగిన భక్తియోగతపఃఫలమంతయు నేవిధమైన స్వయత్నములేక సర్వేశ్వరునిచే నీజన్మమునందే యీయత్యంతస్వల్పకాలమునందే లభించితిని. ౧౧ "మాఱిమాఱిప్పలపిఱప్పుమ్పిఱన్దు" అనునట్లు మారిమారియనేకజన్మములెత్తితిని అనునిట్టిప్రమాణములు ఇంకననేకములున్నను గ్రంథవిస్తరభీతిచే విరమింపఁబడెను. ఇవిపాయ్యల్ పాడల్ గాన నీవాక్యములు నైచ్యానుసంధానపరములనరాదు. ఇట్లుకోసలగోకుల చరాచరమందును వానినిర్హేతుక కృపఫలించియున్నందున నీయర్థమందు సందియంబులేదు. ఇట్లునిర్హేతుకముగా నాళ్వార్లులభించిన జ్ఞానభక్తులను సర్వేశ్వరుఁడు తనసంశ్లేషవిశ్లేషములచే వృద్ధినొందించుచుండెను. సంశ్లేషమనఁగా-ప్రత్యక్షసమానాకారమానసానుభవము. విశ్లేషమనఁగా-బాహ్యానుభవములభింపనందునఁ గలఁతఁజెందినయంతఃకరణశైథిల్యము.

ఇట్లు కలఁగఁజెందు నవస్థలలో నాళ్వార్లునాయికావస్థను బొందుచున్నారు. పురుషునికి స్త్రీయెట్లు కూడునన్న; భర్తకు భార్యయెట్లు (౧) అనన్యార్హరాలో (౨) వానిచేతనే రక్షింపఁదగినదో, (3) వాఁడుదప్ప వేరుభోగ్యములేనిదో (౪) వానిసంశ్లేషమునందే సుఖించునో (౫) వానివిశ్లేషమునందు దుఃఖించునో (౬) వానిచేతనే నిర్వహింపఁబడునో యీయాఱుప్రకారములు సర్వేశ్వరునివిషయముగ చేతనునికినిగలవుగాన నాళ్వార్ల

---

౧॥ భ-శ్రు. ౨॥ 3॥ తిరువాయ్-౭3-౧౦. ౪॥ తి-వి-౭౯. ౫॥ అ-హృ. ౬॥ రా-బా-౧౮-౨3.
౭॥ తిరువాయ్-3౭-౯. ౮॥ తిరువాయ్-౫౭-౧. ౯॥ తిరువాయ్-౨౨-౬. ౧౦॥ తిరువాయ్-౨3-౮. ౧౧॥ తిరువాయ్-౧౬-౮.

స్వరూపము స్త్రీప్రాయమని చెప్పసందేహము లేదు. ౧ "సఏవ వాసుదేవోఽసౌ సాక్షాత్పురుష ఉచ్యతే। స్త్రీప్రాయ మితరత్సర్వం జగద్బ్రహ్మపురస్సరమ్"॥ ౨ "స్వామిత్వాత్మత్వశేషిత్వపుంస్త్వాద్యాస్స్వామినో గుణాః। స్వేభ్యో దాసత్వదేహత్వశేషత్వ స్త్రీత్వదాయినః"॥ అనియు ననేక స్థలములందు స్వతంత్రుఁడైన సర్వేశ్వరుని బురుషునిఁగాను, పరతంత్రులైన చేతనులను స్త్రీలనుగాను జెప్పఁబడియున్నదిగనుక నాళ్వార్లకు నాయికావస్థ సంప్రతిపన్నంబు.

పరిశుద్ధాత్మస్వరూపముగల యాళ్వార్లకు సామాన్య స్త్రీసామ్యమే కాదు. ౩ "నమక్కుమ్ పూవిన్ మిశైనఙ్గైక్కుమిన్బమై" అనునట్లు స్త్రీరత్నమై పద్మవాసినియైన పిరాట్టిసామ్యంబును గలదు. ఇంతియకాదు. ౪ "కిళైన్నె కొల్ నిలమామకళ్ కొల్ తిరుమకళ్ కొల్" అనునట్లు నీళాదేవి భూదేవి శ్రీదేవి అను నీముగ్గురితోను వికల్పింపఁదగిన సామ్యముకలవారైయున్నారు. మఱియు ౫ "ఇప్పాయ్కై క్కైవ్వాలువన్దామ్" ౬ "ముతుమణల్ కున్తేరి", ౭ "ముల్లై యిళఙ్పన్దల్ సిఱ్ఱిల్ మన్ఱియవళైప్పుణర్ ప్పుక్కు", ౮ "మచ్చొడుమాళిగై యేఱి" అను పాశురములయందుఁ జెప్పినట్లు అయిదు లక్షల గోపికా స్త్రీలతోడను, ౯ "పేయ్ములై యుణ్డు", ౧౦ "మునిన్దుశకడముతైత్తు" అను పాశురరీతిగ గోపికలనుమరిపింపఁ జేయునాగరికులైన మధురానగర స్త్రీలతోడను, ౧౧ "నరకనై త్తొలైత్తకరరలత్త" ౧౨ "నరక న్దనై చ్చుప్పుర్ పోకివళైత్తెత్తిన్ద కన్నిమకళిర్ తమ్మైక్కవర్న్ద" అను పాశురరీతిగ నరకాసురాన్తరము పరిగ్రహించిన పదహారువేల స్త్రీలతోడను నాళ్వార్లకు సామ్యముకలదు. మఱియు భగవదనన్యులై సహజభక్తులైన లక్ష్మణాదులసామ్యంబును వీరికిఁగలదు. అదియెట్లన్న ౧౩ "బాల్యాత్ప్రభృతిసుస్నిగ్ధః" ౧౪ "అహంసర్వంకరిష్యామి" ౧౫ "అడియుమ్ తొళుమ్" అనునట్లు శేషత్వమునందు ఇళైయపెరుమాళ్ళతోడను, ౧౬ "రాజ్యఞ్చాహం చరామస్య" ౧౭ "యానేనీయెన్నుడైమైయుమ్నీ" ఇత్యాదులచేత పారతన్త్ర్యమునందు భరతులతోడను, ౧౮ "గచ్ఛతామాతులకులమ్ భరతేనతదాఽనఘః। శత్రుఘ్నోనిత్యశత్రుఘ్నో నీతః ప్రీతిపురస్కృతః", ౧౯ "అవనడియార్ శిఱుమామనిశరా యెన్నైయాణ్డారిఙ్గేతిరియ" ఇత్యాదులచే భాగవతశేషత్వరసానుభవమునందు శత్రుఘ్నాళ్వార్లతోడను, ౨౦ "నతతర్పసమాయాన్తంపశ్యమానో నరాధిపః", ౨౧ "అప్పాఴిత్తైక్కప్పాఴిత్తాఴావముతమ్" అనునట్లు అతృప్తానుభవమందు దశరథమహారాజుతోడను, ౨౨ "యమళార్జున దోరాన్ధ్యేజగామ", ౨౩ "పోనాయ్ మామరుతిన్నడువే" అనునట్లు ఆపదసహానాక్రోశమందు యశోదాపిరాట్టితోడను, ౨౪ "సత్వాసక్తమతిః కృష్ణేదశ్యమానో మహోరగైః। నవివేదాత్మనోగాత్రం తత్స్మృత్యాహ్లాదసుస్థితః" ౨౫ "ఎన్ముడైక్కోళరియే" ఉన్నైచ్చిన్దై శెయ్తు శెయ్తు, ఎన్ముడైత్తీవినైకళ్ ముఴువేరఱిన్దనన్ యాన్, ముడియాతతెన్నెక్కు" ఇత్యాదులవల్ల భగవదేకావలంబనముచే బాధ్యత్వాభావమునందు ప్రహ్లాదాళ్వార్లతోడను, ౨౬ "త్యక్త్వాపుత్రాంశ్చదారాంశ్చరాఘవంశరణంగతః" ౨౭ "పాతమడైవతఱ్పాశత్తాలే మఱ్ఱవర్ పాశఙ్గళ్ ముఴువదుమ్ విట్టు," ౨౮ "తియరతర్క్కుమకన్ తన్నై యన్ఱిమఱ్ఱిలేన్ తఞ్జమాకవే" అనునట్లు ఇతరవిషయత్యాగపూర్వక సిద్ధోపాయస్వీకారమునందు శ్రీవిభీషణాళ్వార్లతోడను, ౨౯ "స్నేహా

౧॥ ౨॥ ౩॥ తిరువాయ్-౩౫-౮. ౪॥ తిరువాయ్-౫౫-౧౦. ౫॥ నా-తి-మొ-౨-౨. ౬॥ పెరి-తి-౧-౫-౧౦-౮.
౭॥ పెరి-తి-మొ-౬-౮-౮. ౮॥ పెరి-తి-మొ-౨-౫-౭-౩. ౯॥ తిరువాయ్-౪౩-౮. ౧౦॥ తిరువాయ్-౬౩-౫.
౧౧॥ తి-మొ-౧౦-౫-౯-౪. ౧౨॥ పెరి-తి-మొ-౪-౫-౩౩. ౧౩॥ రా-బా-౧౮-౨౭. ౧౪॥ రా-అ-౩౧-౨౫.
౧౫॥ తిరువాయ్-౬౨-౮. ౧౬॥ రా-అ-౮౨-౧౨. ౧౭॥ తిరువాయ్-౧౯-౯. ౧౮॥ రా-అ-౧-౧.
౧౯॥ తిరువాయ్-౮౦-౩. ౨౦॥ రా-అ-౩-౪౦. ౨౧॥ తిరువాయ్-౧౫-౪. ౨౨॥ వి-పు-౫-౬-౧౯.
౨౩॥ తిరువాయ్- ౨౪॥ వి-పు-౧-౧౭-౩౯. ౨౫॥ తిరువాయ్-౨౬-౬. ౨౬॥ రా-యు-౧౭-౧౪.
౨౭॥ తిరువాయ్-౪౨-౧౧. ౨౮॥ తిరువాయ్-౨౬-౮. ౨౯॥ ౯-ఈ.

మేపరమోరాజన్ త్వయినిత్యంప్రతిష్ఠితః । భక్తిశ్చనియతావీరభావోనాన్యత్రగచ్ఛతి. ౧ "కణ్ణారిరామపిరాన్ఱై యల్లాల్ మత్తిఱుమ్ కణ్ణరో" అనునట్లు శ్రీరామభక్తియందు సీతాదేవి యనువదితోడను, ౨ "పశ్యామిదేవాం స్తవదేహ సర్వాన్ తథాభూతవిశేషసఙ్ఘాన్ । బ్రహ్మాణమీశంకమలాసనస్థంఋషీంశ్చ సర్వానురగాంశ్చదివ్యాన్" ౩ "నీరాయ్ నిలనాయ్ తీయాయ్ కాలాయ్ నెడువానాయ్ । శీరార్ శుడర్కళిరణ్డాయ్ శివనాయ్ అయనానాయ్" ఇత్యాదులచే భగవదసాధారణ విగ్రహానుభవమం దర్జునునితోడను అన్వయిగలవారై యున్నారు. అంతియే కాదు, వారికంటె నధికులుగానునున్నారు. ఏలనన్నఁగా, ౪ "కుఱ్ఱమిల్ వలర్ మడప్పావైయుమ్ మణ్మకళుమ్ తిరువుమ్" ౫ "అగలకిల్లేనిఱైయుమెన్ఱు అలర్మేల్మఙ్గై యుఱైమార్బా" అను పాశురములయందు సర్వేశ్వరునితోడ ననేకులనుభవించు రసములెల్ల నాళ్వార్లొకరే యనుభవించుచున్నారు. సర్వేశ్వరుఁడు పెరియపిరాట్టి, తిరువడి, తిరువనన్తాళ్వాన్ మొదలగు వారితోడ నొక్కొకవిధముగ ననుభవించుచున్న రసము లెల్లను ఆళ్వార్లొక్కరితోడ ననుభవించుచున్నాఁడు.

ఇందువలన నాళ్వార్లకు స్త్రీసామ్యము సిద్ధించెనే కాని స్త్రీభావమెట్లు జనించెనన్న ౬ "పాఞ్చాల్యాః పద్మపత్రాక్ష్యాః స్వప్నయంత్యాజఘనఘనమ్ । యాః స్త్రియో దృష్టవత్యస్తాః పుంభావం మనసాయయుః" ప్రాకృతమై మాంసాసృగస్థిమేదఃపురీషమయమైన ద్రౌపదిజఘనదర్శనముచేతనే స్త్రీలు మొగతనమును భావించియుండ, అప్రాకృతదివ్యతిరుమేనుకలవాఁడై కందర్పకోటిసమసుందరుఁడై జగన్మోహనాకారుఁడై ౭ "పుంసాం దృష్టిచిత్తాపహారిణమ్" అనునట్లు పురుషులదృష్టిచిత్తంబుల నపహరించువాఁడైన సర్వేశ్వరుని దివ్యతిరుమేను ఆళ్వార్లకు పుంస్త్వమునుబోఁగొట్టి స్త్రీత్వభావనమును గలుగఁజేసెననుటకు సందేహంబులేదు.

ఆత్మస్వరూపము ౮ "అచ్ఛేద్యోయమదాహ్యోయమక్లేద్యోఽశోష్య ఏవచ" అనినట్లు ఛేదింపఁగూడదనియు, దహింపఁగూడదనియు, తడుపఁగూడదనియు, ఎండింపఁగూడదనియు గీతోపనిషత్తునందుఁ జెప్పఁబడియుండ, ౯ "శివనోడుపిరమన్ వణ్ణిరుమడన్దై శేర్ తిరువాకమెప్పోదుమ్" కాలాంతకునితోడ కమలాసనునిని కమలవాసినికిని తనశరీరమందు నెడమిచ్చిన సర్వేశ్వరుని సౌశీల్యము నాయాత్మను ఛేదించుచున్నదనియు, ౧౦ "వేవమెతుయిర్ అళల్ మెళుకలొక్కు" నాయాత్మ నిప్పులో వేసిన మైనమువలె తనస్వరూపము చెడిపింపఁబడుచున్నదనియు, ౧౧ "కణ్ణనుక్కెన్ఱీరియాయ్" మంచిపదార్థములను జూచినయెడల వానినికృష్ణునికి సమర్పింపవలయునని నాయాత్మ ఆర్ద్రతను బొందుచున్నదనియు, ౧౨ "వైకలుమ్ వెణ్ణెయ్ కై కలన్దుణ్డాన్" ప్రేమవ్యాధి, మృదుస్వభావముఁగల నాయాత్మను శోషింపఁజేయుచున్నదనియు, ౧౩ "ఎన్నెఞ్జై నిన్నిడైయేన్ అల్లేన్ ఎన్ఱు నీఙ్గి" అని అచేతనమైనమనస్సు చేతనసమాధినిబొంది వాఁడువిశ్లేషించిన నీకు కరణముగా నుండనొల్లననియు, ౧౪ "ముడియానే" యను తిరువాయ్మొళియందు బాహ్యకరణములు చేతనసమాధినిబొంది ఒక్కొకకరణంబును నితరకరణవ్యాపారముల నాశపడినదనియు, ౧౫ "కడలుమ్ మలైయుమ్ విశుమ్బుమ్" ౧౬ "ఇరుళుమ్ తిణివణ్ణమ్ మానీర్ కళియేపోయ్" అను పాశురములయందు గాలికి సతతగతిత్వంబును ఉప్పుకాలువకు పాటుపోటులును సహజంబులుగా నుండ నవి భగవద్విశ్లేషజన్యంబులనియు, ౧౭ "ఎమ్మానెన్ కోయిల్ యుళ్ళువోయ్ మైశినదువే" మాయాకృతిని జెప్పి నీవును నడుమడుగుచుండుటను యచేతనములతోఁ జెప్పుటయు సంప్రతిపన్నంబులుగా నుండలేదేయన్న; ౧౮ "సిదిధ్యాసితవ్యః" అనునట్లు విధిప్రేరి

---

౧॥ తిరువాయ్మొళి-౬-౫-౧. ౨॥ భ-గీ-౧౧-౧౫. ౩॥ తిరువాయ్-౫-౯-౧. ౪॥ తి-వి-౩. ౫॥ [illegible]
౬॥ భార. ౭॥ శ్రీ-రా-అ-౩-౨౯. ౮॥ భ-గీ-౨-౨౪. ౯॥ తిరువాయ్-౭-౯-౬. ౧౦॥ [illegible]
౧౧॥ తిరువాయ్-౫-౭-౯. ౧౨॥ తిరువాయ్-౧౧-౪. ౧౩॥ తి-౨-౧౦. ౧౪॥ తిరువాయ్-౨-౭-౧. ౧౫॥ [illegible]
౧౬॥ తిరువాయ్-౧౧-౯. ౧౭॥ తిరువాయ్-౧౧-౭. ౧౮॥ [illegible]

త్తమై చేతనసాధ్యమై క్రమపరిణామము నొందెడు లోకభక్తివలెగాక ౧ "అత్యన్తభక్తియుక్తానాం నైవశాస్త్రం నచక్రమః" అనునట్లు ఉల్లోకమై హద్దుమీరిన వీరిస్వభావము శాస్త్రమర్యాదలో నణగనేరదు.

ఈనాయికావస్థయందు వీరికి మూడవస్థలు కలవు. (౧) తోళ్ళిమారవస్థయనియు (౨) తాయ్మారవస్థయనియు (౩) మకళ్ వస్థయనియు. ఇందులో తోళ్ళియనగా–సఖి; ఆపె నాయకుని నాయికతోఁ జెప్పునదిగనుక, నిచ్చట తోళ్ళియనఁగా–ప్రణవమునందు జెప్పఁబడిన అకారవాచ్యుఁడైన యీశ్వరునికిని, మకారవాచ్యుఁడైన చేతనునికిని నుండు అనన్యార్హ సంబంధజ్ఞానమే వానితో నీయాత్మ చేరుటకుఁ గారణముకాన నాసంబంధజ్ఞానమైన ప్రజ్ఞావస్థగానున్నది. తాయ్ అనఁగా–తల్లి; ఆమె కుమార్తెను కని, పెంచి, వివాహముచేసి, యౌవనము వచ్చిన వెనుక వీరియత్తగారింటికి తానే వేగిరముగ వెళ్లవలయునని పదరుట మన కులమర్యాదకుఁ దగదు, అత్తగారింటివారే వచ్చి పిలుచుకొని పోవలయునని చెప్పునదిగాన ఆళ్వార్లకు భగవద్వరణముచేఁ బ్రపన్నత్వమును గలుగఁజేసి దానిని వృద్ధిపఱచి ప్రాప్యవైలక్షణ్యదర్శనముచేత క్రమప్రాప్తిని సహింపక నిప్పుఁడే భగవంతుఁడుండు చోటికి పోవలయునని పదరుచుండునది ప్రపన్నకుల మర్యాదకాదు. ౨ "తత్తస్యసదృశంభవేత్" అని అతియుండవలయు నిట్లు స్వతన్త్రపడుట స్వరూపవిరుద్ధమని యుపదేశించెడి మధ్యమనమఃపదప్రతిపాద్యమై ఉపాయాధ్యవసాయమైన ప్రజ్ఞావస్థగానున్నది. తల్లైమకళనఁగా–నాయిక, గాంధర్వంబునఁ బెండ్లాడి నాయకుని వైలక్షణ్యంబున నీడుపడి కులమర్యాదలనుగూడ పాటింపక పతిని జెందిగాని ధరింపని యువతిగాన, ప్రణవనమఃపదములచేత తెలిసికొనఁబడిన పరమశేషియైన శరణ్యునికి నారాయణపదప్రోక్తమైన స్వరూపరూపగుణవిభూతులచేఁ బ్రాప్తమైన వానివైలక్షణ్యమునను సంధించి తనయనుభవవిళంబమును సహింపక తదేకోపాయత్వాధ్యవసాయమునుగూడ నతిక్రమించి సంశ్లేషించిగాని ధరింపనని పదఱుచున్న ప్రాప్యత్వరమైన ప్రజ్ఞావస్థ నాయికావస్థగానున్నది. ఈమూడవస్థలు వీరికెల్లప్పుఁడు ననుభవమగుచుండునని ౩ "ప్రజ్ఞాత్రైకాలికీమతా" అని త్రికాలజ్ఞాన ప్రతిపాదకమైన ప్రజ్ఞాపదముచే ద్యోతితంబులయ్యె.

సమ్బన్ధజ్ఞానమును సఖినిగాను, ఉపాయాధ్యవసాయజ్ఞానమును తల్లినిగను చెప్పినయెడల అవియొక్కొక్కటేగనుక, నొకసఖియు నొకతల్లియుగదా యుండవలెను, ౪ "అన్నైయరుం తోళ్ళియరుమ్" ౫ "తోళ్ళిమార్ పలరయాడపోతుమినెన్న" ౬ "అన్నయర్నాణ" అనిఅనేకులైన చెలికత్తెలు తల్లులునుండునట్లాళ్వార్లుపాదించినందుకుగమకమేమున్న; (౧) పితృత్వ (౨) రక్షకత్వ (౩) శేషిత్వ (౪) భర్తృత్వ (౫) స్వామిత్వ (౬) ఆధారత్వ (౭) ఆత్మత్వ (౮) జ్ఞాతృత్వ (౯) సమ్బన్ధములు తొమ్మిదియున్నవిగానను, ఉపాయభూతుఁడైన సర్వేశ్వరునియొక్క వాత్సల్యస్వామిత్వ సౌశీల్యసౌలభ్య జ్ఞానశక్తిబలైశ్వర్యవీర్యతేజఃకృపాద్యనేక కల్యాణగుణములనుబట్టి వచ్చెడు అధ్యవసాయరూపమైన జ్ఞానముల యొక్క భేదములచేతను సఖమాతలనేకులని పాడించిరి.

ఈతిరువాయ్మొళియందు (౧) తీర్ప్పారైయామిని, (౨) తువళిల్మామణిమాడమోఙ్గు, (౩) కరుమాణిక్కమలై ఈమూడుదశకంబులును తోళ్ళివాక్యములుగానున్నవి, (౧) ఆడియాడి (౨) పాలనాయేళ్లుకలుమ్, (౩) మన్నైయిరున్దుతుళావి, (౪) కడల్ఞాలమ్, (౫) మాలుక్కువైయ్యమ్, (౬) తిణ్ణమ్మళో, (౭) కఙ్గులుమ్పకలుమ్ ఈయేడుదశకంబులును తాయ్మారవస్థావాక్యములుగానున్నవి. (౧) అఙ్గైత్తెయమడనాయ్, (౨) వైకల్పూఙ్గళిల్వాయ్, (౩) పొన్నులకాళీరో, (౪) ఎఙ్గానులకమ్, (౫) వాయున్దిరైయుకళ్, (౬) ఏఱాళుమి

౧ ... ౨ శాం-సు-౩౯-౫౦. ౩ ...
౪ తిరువాయ్-౪౪-౫. ౫ తిరువాయ్-౫-౨-౮. ౬ తిరువాయ్-౪-౩-౮.

త్తైరోనుమ్, (౭) మాశఱుకోతి, (౮) ఊరెల్లాన్దుఞ్జి, (౯) ఎజ్జనేయో, (౧౦) మానేయ్‌నోక్కు, (౧౧) మిన్ని డైమదైనార్, (౧౨) వెళ్ళైచ్చురిశజ్గు, (౧౩) ప్రథైయరావి, (౧౪) నజ్గళ్ పరివళ్ళై, (౧౫) ఇన్నుయిర్‌చ్చే వల్, (౧౬) మల్లికైక్కమళ్ తెన్నల్, (౧౭) వేయ్‌మరుతోళిణై ఈపదునేడు దశకములు తలైమకళవస్థావా క్యములుగానున్నవి.

ఒక స్త్రీ౭ సంవత్సరములవఱకు (౧) పేదై యనియు, ౧౩ సంవత్సరములవఱకు (౨) పెతుమ్బై యనియు, ౧౮ సంవత్సరములవఱకు (౩) మజ్గై యనియు, ౨౪ సంవత్సరములవఱకు (౪) మడన్దై యనియు, ౩౦ సంవత్సరములవఱకు (౫) అరివై యనియు, ౩౯ సంవత్సరములవఱకు (౬) తెరివై అనియు, ౪౦ సంవత్సరములకుఁ బైన (౭) పేరిళమ్ పెణ్ అనియు ఏడవస్థలుగలిగియుండునట్లు, ఆళ్వార్లకును సప్తావస్థలుకలవు. అవి యెట్లన్న; ప్రథమ దర్శనమందుఁ బుట్టెడి (౧) యభిలాషయు, దృష్టమైన యావిషయమందు కలిగెడి స్మరణమనెడు (౨) చిన్తనయు, అట్టిస్మరణము అనవరతముఅనుభవమగునట్టి (౩) అనుస్మృతియు, ఆవిషయము నవశ్యమనుభవించియే తీరవలయునను నాశయనెడు (౪) ఇచ్ఛయు, ఆయాశనురసాంతరముచేత మార్చుటకు నసాధ్యమనునట్లు పరిపక్వమైన (౫) రుచియు, తత్సంశ్లేషవిశ్లేషములలో సుఖదుఃఖముల నొందుట యనెడు (౬) పరభక్తియు, తద్విశ్లేషమునందు సత్తానాశము కలుగుటయనెడు (౭) పరమభక్తియునను నీఏడవస్థలుగానున్నవి.

నాయికావస్థయందు వర్ణించెడు అవయవవిశేషములకు భావమేమన్న; ౧ "తోకైమామయిలార్ కళ్" అని స్త్రీలను నెమళ్లనుగాఁజెప్పుట యలకభారవిస్తృతివలనగాన దానిచేత నీయాత్మయొక్క జ్ఞానవికాసమును వివరించుచున్నది. (౧) ౨ "పిత్తైయుదైవాణుతల్" అనినెత్తిచంద్రకళగాఁ జెప్పుటవలన దానిధావళ్యముచేత నీయాత్మకుస్వస్వాతంత్ర్యము అన్యశేషత్వములనెడు దోషగంధరహితమైన పరిశుద్ధినిబలుకుచున్నది. (౨) ౩ "విల్ పురువక్కొడి" అని కనుబొమను ధనుస్సుగాఁ జెప్పుట సమాకారమును బట్టిగాన, దానిచేత బాహ్యాభ్యంతర కరణముల యొక్క నియమనమైనదానిని దర్శింపఁజేయుచున్నది. (౩) ౪ "అమ్బన్నకణ్ణాళ్" అని నేత్రములను గురిమీఁదఁ బడెడుబాణములుగాఁ జెప్పుటచేత ౫ "తామరైయాళ్ కేళ్వనొరువనైయే నోక్కుముణర్వు" అనితనకు ననురూపమైన విషయమునవలంబించినజ్ఞానమును జ్ఞాపకపఱచుచున్నవి. (౪) ౬ "ముత్తన్నవెణ్మురువల్" అనినవ్వునుముత్యములుగాఁ జెప్పినందున ౭ "ముత్ ప్రీతిః ప్రమదో హర్షః" అనునట్లు భగవదనుభవముచేతనైన యానన్దము నానతిచ్చుచున్నది. (౫) ౮ "పవళవాయాళ్" పెదవినిపగడముగాఁ జెప్పినది భగవద్విషయము నందుండెడి అనురాగమును (ఎరుపు - ప్రీతి) అందించుచున్నది. (౬) ౯ "శెప్పన్నమెన్ములై" అనిపరిపక్వమైన స్తనములనుగిన్నెలవలెచెప్పియున్నందున శేషిమైన సర్వేశ్వరుఁడాశపడిపైఁబడఁదగినట్లు వృద్ధిపొందిన భక్తి నివ్యక్తీకరించుచున్నది. (౭) ౧౦ "మిన్ననైయనుణ్మరుజ్గుల్" అని నడుమును మెరుపుగాఁ జెప్పినది సన్నమును బట్టిగాన, పైచెప్పినజ్ఞానావస్థలకెల్ల నాధారమైన యాత్మయొక్క స్వరూపమణుత్వమని యూహింపుచున్నది. (౮) ౧౧ "తేరణజ్గల్ అల్కుల్" అనియెడి నితమ్బవైలక్షణ్యము భర్తృభోగ్యముగానున్నదిగాన ౧౨ "తేనుంపాలుమ్ కన్నలుమముతుమాకి త్తిత్తు" అనునట్లు సర్వేశ్వరునికి మిక్కిలిరసావహమైన ఆత్మవస్తువు యొక్క భోగ్యతనుబోధించుచున్నది. (౯) ౧౩ "అన్నమెన్నడైయినార్" అని హంసతోఁ బోల్చుట గమన సౌందర్యమును బట్టిగాన భగవద్భాగవతులు శ్లాఘించెడు స్వరూపానురూపమైన నడకయనెడి యనుష్ఠానము ఆలోకింపఁబడుచున్నది (౧౦).

---

౧। తిరువాయ్-౫-౨-౨. ౨। తి-మొ-౨-౯-౯. ౩। తిరువాయ్-౫-౬-౭. ౪। తి-మొ-౬-౮-౭. ౫। ౧-తిరువన్దా-౬౭.
౬। నా-తి-మొ-౫-౭. ౭। నా-లిం-మ. ౮। తిరు-మా-౧. ౯। తి-పా-౨౦. ౧౦। తి-మొ-౩-౯-౫.
౧౧। తి-మొ ౧-౪-౭. ౧౨। తిరువాయ్-౭-౭-౪. ౧౩। తి-మొ-౯-౫-౭-౨.

వీరికి నాయికావస్థయందు శత్రువులెవరనఁగా-సాధ్యసాధననిష్ఠులు; అనుకూలులెవరనఁగా-సిద్ధసాధననిష్ఠులు. శిష్యుక్తదశయందు శత్రువులు ౧ ॥ నమ్మురైయేతలర్ మున్బునాణి" అనుపాశురమునందు సిద్ధసాధననిష్ఠులుగాను మిత్రులు ఉపేయభావనిష్ఠులైన సాధ్యపరులుగానున్నారు. వీరికి అయత్నేరియార్ ఎవరనఁగా-కర్మజ్ఞానభక్తి ప్రపత్తులనుపాయముగానవలంబించినవారును, అర్చావతారమును వదలి దేవతాన్తరాన్తర్యామియైన సర్వేశ్వరు నినారాధించువారును. ప్రపత్తిని నుపాయముగా ననుష్ఠించువారినిగూడ వీరిలోఁ జేర్చవచ్చునాయనఁగా-స్వగతస్వీకారగర్భమై పరగతస్వీకారమైనసిద్ధసాధనమునకు బహిర్భూతముగానున్నందున కర్మజ్ఞానభక్తినిష్ఠులతోఁ బ్రపత్తినిష్ఠులనుగూడఁ జేర్చవచ్చును. ౨॥ ఊరవర్ కవ్వై యందు ఊరవరనఁగా-ఆత్మప్రాప్తికాముకులైన కేవలులు. ౩॥ నాట్టారోడియల్వొళిన్దు" నాట్టారనఁగా-ఇహలోకైశ్వర్యకాములు. ౪॥ ఎద్గల్ కణ్ ముకప్పే ఉలకర్ కళ్లామ్" ఉలకర్ కళ్ అనఁగా-స్వర్గాదిపరలోకైశ్వర్యకాములైన స్వతన్త్రులు. ౫॥ శిఱుశుళకు " ౬ ॥ శీరార్ శుళకిల్" అనుపాశురములయందు శిఱుశుళకు అనఁగా-దేహాత్మవివేకమునకుఁ దగినప్రమాణము. శీరార్ శుళకు అనఁగా-జీవాత్మ భేదమును దెలిపెడిప్రమాణము. ౭॥ శెల్ కతిర్ మాలై" మాలై యనగా-రాగోత్తరమై పదార్థములు విశదముగాఁ గనఁబడని సంధ్యాకాలముగనుక, పదార్థములయందన్యథాప్రతిపత్తికి హేతువైన రాజసజ్ఞానముగానున్నది. ౮॥ శూళ్గిన్ఱ కఙ్గుల్" కఙ్గుల్ అనగా-పదార్థము లొకటియు దెలియకుండుటయు, ఏమైన గనఁబడినయెడల యదివిపరీతముగాఁ గనఁబడునంధకారముచే వ్యాప్తమైన రాత్రిగనుక, జ్ఞాతవ్యార్థములను బ్రకాశింపఁజేయక విపరీతప్రతిపత్తిని బుట్టించెడి తామసజ్ఞానముగానున్నది. ౯ ॥ కాలైయెళున్దిరున్దు" కాలైయనఁగా-బ్రాహ్మ ముహూర్తముగనుక, సత్త్వోత్తరమై యంధకారముపోయి తెల్లవారుచుండు ప్రాతఃకాలము గనుక, పదార్థములవాస్తవజ్ఞానమునకు హేతువైన సాత్త్వికజ్ఞానముగా నున్నది. ౧౦ ॥ పకల్కణ్డేన్" పకల్ అనఁగా-పదార్థములను సంశయవిపర్యయములు లేక విశదముగాఁ బ్రకాశింపఁజేసెడు పగటికాలము గనుక, ౧౧ ॥ నారణనైక్కణ్డేన్" అనునట్లు సమస్తకల్యాణగుణవిగ్రహవిభూతివిశిష్టుఁడైన విష్ణువును విశదముగ విమర్శించి విపులముగ సాక్షాత్కారహేతువైన శుద్ధసత్త్వజ్ఞానముగానున్నది. ౧౨ ॥ నీణిలాముత్తత్తునిన్ఱివణోక్కినాళ్" నిలాముత్తమనఁగా-భాగవతవిషయమే పరమప్రాప్యమని ప్రకాశించెడి పరమపురుషార్థముగానున్నది. ౧౩ ॥ కైక్కళైయుమ్ మేక్కలైయుమ్" కలైయనఁగా-వస్త్రము; అదిశరీరమునుగప్పి దాని స్వరూపమును దెలియకుండఁజేయునదిగాన నాత్మనునావరించిదాని శేషత్వస్వరూపమును దెలియకుండఁజేయు నహంకారముగానున్నది. వళైయనగా-గాజు మొదలగు హస్తాభరణము; అది ఆభరణములలోఁ బ్రధానమైనదై మదీయత్వాభిమానమును బుట్టించునదై హస్తమును నావరించునదై శుష్కశరీరమునందుండి జారునదిగాన త్యాజ్యములలోఁ బ్రధానమై మనస్సును కబళీకరించి యుండునదై వైరాగ్యనివర్త్యమైన మమకారముగానున్నది.

ఇంక లీలోపకరణములకు స్వాపదేశమేమన్న; ౧౪ ॥ పన్దుమ్ కళలుమ్ తన్దుపోకునమ్బి" పన్దు అనగా-నానా వర్ణములుగలనూలుతోఁ జేయఁబడినబంతిగాన ౧౫ ॥ లోహితశుక్లకృష్ణామ్" సత్త్వరజస్తమోగుణమైయీశ్వరలీలో పకరణమైనశరీరముగానున్నది. ॥ కళల్" అనగా-అయిదు చిన్నగచ్చకాయలుగాన, భోగోపకరణములైన పంచేన్ద్రి

యములుగానున్నవి. "యాఴ్, తెన్దల్, మతియమ్, అడిశిల్, శాన్దమ్, పూ౯, అశిల్" అనగా-భోగ్యములైన శబ్దాదివిషయములుగానున్నవి. "శిట్ట్రిల్" అనగా—బాలురాటలాడుకొనెడు ఇసుక ఇల్లుగనుక, భోగస్థానమైన అవయవవిశేషముగానున్నది. "వాడై, అన్రిల్" అనగా—బాధకపదార్థములుగానున్నవి. "ఇరవునెడుమై" అలస్యమును సహింపకుండుట. "చంద్రోదయము" అనగా—విశ్లేషమునందు వివేకమునహితము బాధకముగానుండుట.

ఇంకను సర్వేశ్వరుని యొద్దకు పక్షులను దూతలనుగాఁబంపుటకు స్వాపదేశమేమనగా; పక్షులు అనగా—అవి రెండుతెక్కలచేత నెగురునట్లు ౧ "తథైవజ్ఞానకర్మభ్యాంప్రాప్యతేపురుషోత్తమః" అనునట్లు జ్ఞానానుష్ఠానము గలవారు; ౨ "శెఙ్గాలమడనారాయ్-కుడకూత్తత్తున్దూతాయ్-నుమరోడే-నుఙ్గాల్కళ్ళన్దలైమేత్తు-మీరో" ఇత్యాదులయందు నాచార్యులుగాను, ౩ "నీయునిన్నఙ్గిత్తైయ శేవలుమాయ్" ఇత్యాదులయందు సబ్రహ్మచారులుగాను, ౪ "ఇళఙ్గిళియేయా౯వళర్త్తనీయలైయే" ఇత్యాదులయందు శిష్యులుగానున్నారు. ఇందులో "ఉడ౯మేయుమ్మడవన్నఙ్గాళ్"అనుహంసలెవరనగా—సారాసారవివేక చతురులై, సర్వేశ్వరుఁడు హంసరూపియై శాస్త్ర ప్రదానముచేసినట్లు తమశిష్యులకు శాస్త్రోపదేశము చేయువారును; ౫ "నబధ్నాతిరతింహంసః కదాచిత్కర్దమామ్భసి" సంసారకర్దమమందు మనస్సుపొందనివారును;౬"కుడిచ్చిమ్మైయిలన్నఙ్గళే" అనునట్లుభార్యాపుత్రాదులతో నుండియు భగవదనుభవమునందవగాహించిన ౭ "నల్లిర్న్దశీల౯నయాశల౯" అనెడివైభవముగల శెల్వనమ్బి. ౮ "మెయ్న్నావ౯ మెయ్యడియా౯విష్ణుచిత్త౯" అనెడి పెరియాళ్వార్లవంటివారును; ౯ "శిట్ట్రైయిట్ట్రుము ట్ట్రిల్ మూఙ్గిల్మూన్రు తణ్డరొన్రిల్నరశ్రుపశ్రుర్" అనునట్లుసకలసాంసారికసంగమును వదలిన పరమహంసలైన శ్రీమన్నాథమునులు, శ్రీయాళవందారు మొదలగు నుత్తమాశ్రమమును స్వీకరించినవారు ను; ౧౦"ఇతుశోల్లియరు శాశ్రీవరివన్దే" అనియెడితుమ్మెదలెవరనగా; ౧౧"స్థితేరవిన్దేమకరన్దనిర్భరేమధువ్రతోనేక్షురకంహివీక్షతే"అనునట్లు అసారమైన సంసారమును పాటింపక ౧౨ "ఊటియతే౯"అనియెడిభగవద్విషయమనియెడితేనెను పానముచేయువారును,షట్పదనిష్ఠులును. ౧౩ "వణ్డినఙ్గళ్ కామరఙ్గళిశై పాడుమ్"అనునట్లుకాలోచితమైన రాగములతోగుణానుభవముజేయువారునునైననారదమహర్షి,తిరుప్పాణాళ్వార్లు;౧౪"యా౯వళర్త్తకిళికాళ్"అనుచిలుకలెవరనగా- ౧౫ "ఇన్నడిశిలొడుపాలముతూట్టి" అనునట్లు ఉపదేశముఖముగ ధారక పోషకములైన భగవద్గుణములననుభవించి యాచార్యులతో నేకకణ్ఠులైయుండువారును, భాగవతాభిమాననిష్ఠులునైన ౧౬ "తెన్గురుకూర్నకర్నమ్బిక్కన్బ౯" అను శ్రీమధురకవియాళ్వార్లును, ౧౭ "నావలిట్టొళితరుకిన్రోమ్ నమన్దమర్తలైకళ్మీతే" తిరునామమును నవలంబించిన బలముచేతయముని తలమీఁద నిర్భయముగఁగాలుబెట్టెడివారును,భాగవతపాదధూళివలె వారికినత్యన్తపరతన్త్రులునైన తొండరడిప్పొడియాళ్వార్లు, *ఇరామాశనుశైయారని నిరూపకతిరునామముగల ఆళ్వా౯, ఆణ్డా౯,.ఎమ్బార్, మొదలగువారు; ౨ "శెఙ్గాలమడనారాయ్" ౧౮ "కురుకినఙ్గాళ్" అనునారమొదలగుపక్షులెవరనగా ౧౯ "ఆశఱుతూవివెళ్ళైక్కురుకే" అని కొంగ నిర్దోషములైన తెక్కలుగల

౧।  ౨॥ తిరువాయ్-౮౭-౧. ౩॥ తిరువాయ్-౪-౧. ౪। తిరువాయ్-౪-౭.
౫।  ౬॥ తి-విరు-౨౯. ౭॥ పెరి-తి-మొ-౪.౪.౮. ౮। పెరి-తి-మొ-౪-౯-౧౧.
౯॥ తిరుచ్చన్దవిరు-౫౨. ౧౦॥ తిరువాయ్-౪-౬. ౧౧॥ అ-స్తో-౨౭. ౧౨। తి-మొ-౪-౩-౯.
౧౩॥ పెరు-తి-మొ-౮-౪. ౧౪॥ తిరువాయ్-౭౨౮. ౧౫॥ నా-తి-౫-౫. ౧౬॥ కణ్ణినుణ్-౯-౧౧.
౧౭॥ తి-మా-౧. ౧౮। తిరువాయ్-౮౭-౨. ౧౯॥ తిరువాయ్.౫౮.౮.

డయు బాహ్యాభ్యన్తరములయందు నిర్మలమై, ౧ "వాయుమ్ తిరై యుకళుమ్" అనునట్లామిష్మగ్రహణమునందలి యేకాగ్రచిత్తతచేతనలలుతనపైఁబడినను చలింపకుండునట్లు ౨ "యస్మిన్ రేత్సృణ్డరీకాక్షం సబాహ్యాభ్యన్తరశ్శుచిః" అని నిరన్తరభగవత్స్మరణచేత బాహ్యాన్తరములందునుపరిశుద్ధులై, ౩ "అభిభూయమానావ్యసనైరనాథాధోక్షజచేతసః" అనునట్లు ఆధివ్యాధులుపైఁబడుచున్నను, చలింపకుండెడి శ్రీకులశేఖరప్పెరుమాళ్లు; మేఘము లెవరనగా-౪ "తిరుమాల్ శీర్ కడలైయుళ్ పాతిన్దశిన్దై యోన్" అనునట్లుభగవద్గుణామృత సాగరమునందవగాహించి కడుపారనాస్వాదించి ౫ "ఉయిరళిప్పాన్ మాకజ్గళెల్లామ్ తిరిన్దు" చేతనోజ్జీవనార్థముగ సర్వత్రసంచరించి శ్రీసూక్తివర్షములను వర్షించెడిపరమోదారులైన ముతలాళ్వార్లను, తిరుమళిశైయాళ్వార్లను; ౬ "కారార్ పుయత్తైక్కలికన్ఱి" ౭ "అరుళ్ మారి" అనెడి కృపనువర్షించుచున్న తిరుమంగైయాళ్వార్లను, ౮ *ధూమజ్యోతిస్సలిలమరుతాంసన్నిపాతమైన మేఘములుస్థానస్థానార్థములను గూడజూడకజలస్థలవిభాగములేక నెల్లు సర్వత్రసర్వసమముగ వర్షించునో, అట్లాచార్యాజ్ఞోల్లంఘనము చేవచ్చెడి స్వానర్థమునుగూడ పాటింపకనధికారి యనధికారియని గూడ జూడకగోపురమెక్కి తిరుమన్త్రమును నందఱిమీద వర్షించిన ౯ "కుణన్దికళ్ కొణ్డల్" అనుమన యతిరాజులవారు కాళమేఘముగ నున్నారు.

నమ్మాళ్వార్ల ప్రభావసంగ్రహము సంపూర్ణము.

నమ్మాళ్వారుల తిరునక్షత్రతనియన్.

వృషభేతు విశాఖాయాం కురుకాపురికారిజమ్ । పాణ్డ్యదేశేకలేరాదౌ శఠారింసైన్యపంభజే ॥
శ్రీవిజ్ఞానదినోత్తరేఽహనికలౌ వర్షేప్రమాద్యాహ్వయే । మాసేమాధవనామ్ని భార్గవదినే చక్షేవిశాఖాభిధే ।
లగ్నేశుద్ధచతుర్దశీతిథియుతే శ్రీమత్కుళీరేపిచ । క్షిత్యాంప్రాదురభూత్పరాఙ్కుశకవి ర్భాగ్యోదయాన్నాదృశామ్॥

తనియన్.

మాతాపితా యువతయ స్తనయావిభూతిః । సర్వంయదేవ నియమేన మదన్వయానామ్ ।
ఆద్యస్యనః కులపతే ర్వకుళాభిరామమ్ । శ్రీమత్తదఙ్ఘ్రి యుగళం ప్రణమామిమూర్ధ్నా ॥

వాళి త్తిరునామమ్.

ఆనతిరువిరుత్తమ్ నూఱుమరుళినాన్ వాళియే । ఆశిరియమేళుపాట్టళిత్తపిరాన్ వాళియే ।
ఈనమఱవన్దాది యెణ్బత్తేళీన్దాన్ వాళియే । ఇలకుతిరువాయ్ మొళి యాయిరత్తోరు నూత్తిరణ్డురైత్తాన్ వాళియే ।
వానణియుమ్ మామాడ క్కురుకైమన్నన్ వాళియే । వైకాశివిశాకత్తిల్ వన్దుతిత్తాన్ వాళియే ॥
శేనైయర్ కోనవతారమ్ శెయ్తవళ్ళల్వాళియే । తిరుక్కురుకైచ్చడకోపన్ తిరువడికళ్ వాళియే ॥

---

మేతినియిల్ వైకాశి విశాకత్తోన్ వాళియే । వేతత్తైచ్చెన్దమిళాయ్ విరిత్తురైత్తాన్ వాళియే ।
ఆతిగురువాయ్ ప్పువియిలవతరిత్తాన్ వాళియే । అనవరతమ్ శేనైయర్కోనడి తొళువోన్ వాళియే ।
నాతనుక్కు నాలాయిరమురైత్తాన్ వాళియే । నమ్మతుర కవివణఙ్గుమ్ నావీఱన్ వాళియే ।
మాతవన్పొఱ్పాతుకైయాయ్ వళర్న్దరుళ్వోన్ వాళియే । మకిళ్ మాఱన్ శడకోపన్ వైయకత్తిల్వాళియే ॥

నాళ్ పాట్టు.

ఏరార్ వైకాశి విశాకత్తినేఱ్ఱత్తైప్పారోరఱియప్పకర్కిన్ఱేన్ ।
శీరారుమ్ వేతమ్తమిళ్ శెయ్త మెయ్యనెళిల్ కురుకై నాతనవతరిత్తనాళ్ ॥
ఉణ్డో వైకాశివిశాకత్తుక్కొప్పారునాళ్, ఉణ్డోశడకోపర్ క్కొప్పారువర్ ।
ఉణ్డోతిరువాయ్ మొళిక్కొప్పు తెన్కురుకైక్కుణ్డో, ఒరుపాల్ తన్నిలొక్కుమూర్ ॥

ఆళ్వార్ తిరువడికళే శరణమ్.

---

౧॥ తిరువాయ్-౧౧-౧. ౨॥ ౩॥ భాగ-పు-౧౦-౨౬-౧౫. ౪॥ పెరియతిరువ-౬౯. ౫॥ తి-వి-౩౨.
౬॥ తి-మొ-౩-ప-౨-౧౦. ౭॥ తి-మొ-౩-ప-౪-౧౦. ౮॥ మేఘ-సం-౧-స. ౯॥ ఇరామానుజనూ.

శ్రీః

శ్రీమతేశఠకోపాయనమః.

శ్రీమతేరామానుజాయనమః.

# తిరువాయ్మొழி ప్రభావసంగ్రహము.

సర్వసంస్కృతశాస్త్రములలో ఋగాదిచతుర్వేదము లెట్లు సర్వోత్కృష్టములో, అట్లే సకలద్రవిడశాస్త్రములలో నమ్మాళ్వార్లు సాధించిన నాలుగు ప్రబంధములే సర్వోత్కృష్టములైనవి. (౧౦౦) పాశురములుగల తిరువిరుత్తము ఋగ్వేదసమమనియు, (౭) పాశురములుగల తిరువాశిరియము యజుర్వేద సమమనియు, (౮౭) పాశురములుగల పెరియతిరువన్దాతి యథర్వణవేదసమమనియు, (౧౧౦౨) పాశురములుగల ఈతిరువాయ్మొழి సామవేదసమమనియు చెప్పఁబడుచున్నవి. ౧ "వేదానాం సామవేదోస్మి" అనునట్లు సంస్కృతవేదములలో సామవేదమెట్లు భగవన్ముఖోల్లాసకరమై సర్వశ్రేష్ఠమైనదిగానున్నదో, అట్లే ద్రావిడవేద చతుష్టయంబులోను నీతిరువాయ్మొழி భగవదత్యన్తముఖోల్లాసకరమై విగతసమానాధికంబుగ విలసిల్లుచున్నది. సంస్కృతవేదములవలె ద్రవిడవేదంబులును ననాదియు, నిత్యంబులును, నిర్దోషంబులును నపౌరుషేయంబులునై యున్నవి. సంస్కృతవేదంబులకు శిక్షా వ్యాకరణము నిరుక్తము ఛందస్సు కల్పము జ్యోతిషమనెడు షడంగములుండునట్లు, ఈద్రవిడవేదములకును ౨*ఆఱంగఙ్గూఱియ తిరుమంగైయాళ్వార్లుసాధించిన (౧) పెరియతిరుమొழி, (౨) తిరుక్కుఱున్దాణ్డకము, (౩) తిరునెడున్దాణ్డకము, (౪) తిరువెழுకూత్తిరుక్కై, (౫) శిఱియతిరుమడల్, (౬) పెరియతిరుమడల్ అను ఆఱంగంబులు నమరియున్నవి. సంస్కృతవేదములకు, మీమాంసా న్యాయ పురాణ ధర్మశాస్త్రాద్యుపాంగము లెనిమిదియున్నట్లు ద్రవిడవేదంబులకును తక్కిన యెనమండ్రాళ్వార్లు సాధించిన దివ్యప్రబంధము లుపాంగములుగానున్నవి.

ఈద్రవిడప్రబన్ధము లాళ్వార్లచే నిర్మింపఁబడినవైయుండ వీనికి ననాదిత్వమెట్లన్న :- సృష్టికాలమునందు చతుర్ముఖబ్రహ్మ సంస్కృతవేదములను ౩ "ధాతాయథా పూర్వమకల్పయత్" అనునట్లు మునుపటియాను పూర్విని స్మరించిచేయునట్లే, ఆళ్వార్లును ౪ "ఉళ్ళితోఱ్ఱు" అనునట్లు మునుపటియాను పూర్విమారకుండ ద్రవిడవేదములను సాధించిరి. ౫ "వేదాంశ్చ ప్రహిణోతితస్మై" అనునట్లు సంస్కృతవేదములను,బ్రహ్మ సర్వేశ్వరుని యనుగ్రహామువలన స్మరించి తన జ్యేష్ఠకుమారుఁడైన రుద్రునికి నధ్యాపనముజేసినట్లు, ఆళ్వార్లును ౬ "తనైన్ఱత్తాన్పాడి" అనునట్లు ద్రవిడవేదములను సర్వేశ్వరుని యనుగ్రహాముచే స్మరించి తమజ్యేష్ఠజ్ఞానపుత్రులైన శ్రీమధురకవియాళ్వార్లకు నధ్యయనముచేయించిరి.

౭ "ఏతత్సామగాయన్నాస్తే"అని సామవేదమెట్లు గానప్రధానమై శ్రావ్యమైయుండునో,అట్లే,౬ "పణ్ణార్ పాడల్" ౮ "పణ్బుడై వేతమ్" ౯ "పణ్ణిల్ తలై కొళ్ళప్పాడి" ౧౦ "వాట్టమిల్ పుకழ் వామననై యిశై కూట్టి"

౧॥ భ-గీ-౧౦-౨౨. ౨॥ ఈ-ర-మా-౯. ౩॥ తై-నా-౧-౩౮. ౪॥ తిరువాయ్-౧౧-౫.
౫॥ ౬॥ తిరువాయ్-౯౬-౫. ౭॥ తై-భృ-౧౧. ౮॥ తిరువాయ్-౫౬-౫.
౯॥ తిరువాయ్-౨౫-౨. ౧౦॥ తిరువాయ్-౧౪-౧౧.

౧"ఇక్కై యొరుమ్పత్తిల్ పాడవల్లారవర్ కేశవన్ తమరే" ౨ "ఇక్కై మండలైకళ్ తీర్త్తిలాళ్ఫ్పర్ శ్రీనెల్ళ్ళు" ౩ "నావియలాలిశై మాలైకళ్ తీర్త్తి" ఇత్యాద్యనేక ప్రమాణములచేత తిరువాయ్మొళ్ళియు గాన ప్రధానమై పరమశ్రావ్యముగనుండును. సామసంగ్రహమైన ఋగ్వేదము, ౪ "ఋచస్సామరసః" అనునట్లుగాన రసముచేత * హావ్ హావ్ హావ్ మొదలగు స్తోభములచే సామవేదముగ విస్తరింపఁబడినట్లు, తిరువాయ్మొళ్ళిసంగ్రహమైన తిరువిరుత్తము, ౫ "ఇశై కూట్టి" అనురీతిగఁ గానరసముచేఁజేర్చ ౬ "అనుస్యూతయామునమ్" అనునట్లు వేయిపాశురములుగల తిరువాయ్మొళ్ళిగా విస్తృతంబయ్యె.

ఇట్లాళ్వార్ల దివ్యప్రబంధములు వేదసమము లేకావు; వేదోపబృంహణంబులైన పఞ్చరాత్ర పురాణేతిహాస సమములునై సర్వేశ్వరుని స్వరూపరూపగుణవిభూతి చేష్టితములను విస్తారముగ విశదపఱచుచున్నవి. ఈద్రవిడవేదములు సంస్కృతవేదోపబృంహణములకు సమములేకావు; వానికంటెను పరమోత్కృష్టములుగానున్నవి. అది ఏలననఁగా; వానికి కర్తలు రజఃప్రచురులును తమఃప్రచురులునై, పరిచ్ఛిన్నజ్ఞానముగల దేవమున్యనుగ్రహమూలకజ్ఞానముగలవారలుగనున్నారు. ద్రవిడవేదములను పాడించిన యాళ్వార్లో, పరమసాత్త్వికాగ్రేసరులై యపరిచ్ఛిన్నజ్ఞాన శక్తులుగల శ్రియఃపత్యనుగ్రహమూలకజ్ఞానముగలవారైయున్నారు. అవి స్వాధ్యాయ యోగాదులచే సంపాదించిన జ్ఞానముచే నిర్మింపఁబడినవి. ఇవియో, గంగాప్రవాహమువలె స్వయముగఁ బ్రవహించుచున్న భగవత్కృపాలబ్ధ దివ్యజ్ఞానముచే నిబద్ధములైనవి. ఆ గ్రంథకర్తలైన ఋషులకుఁ గందమూల ఫలాదులాహారంబులు, ఈగ్రంథకర్తలైన యాళ్వార్లకో, ౭ "ఉణ్ణుమ్ శోఱు పరుకునీర్ తిన్నుమ్ వెత్తిలైయుమెల్లామ్ కణ్ణన్" అనుచందంబున సర్వవిధధారక పోషక భోగ్యంబులును సర్వేశ్వరుఁడైయున్నవి.

పెరుభగవత్స్వరూపము సనందు, ౮ "అప్పునిక్ తుళుమ్బ" ౯ "కడలుమ్మలైయుమ్ విశుమ్బుమ్ తుళాయ్" ౧౦ "తిరుమాలెన్ను" ౧౧ "ఎజ్జే [illegible]" అనియు, ౧౨ "మురణ్ఞ్ఞుమిఞ్ఞుమ్ ఎక్కై" అనియు, పడినపరమదుఃఖమంతయు నానాసిద్ధాదిఋషులెవ్వాధికపుత్రవియోగములకుఁ బడరు. వారికి సాధనసాధ్యములు దేవతాంతరములు గానుండును; వీరికి నుపాయోపేయములు రెండును శ్రియఃపతి తప్ప వేరేలేదయ్యె. వాల్మీకిమహర్షి, రామకథ జెప్పెదనని యుపక్రమించి గంగాగాఙ్గేయసంభవాద్యసత్కథలచే ముఖులఁదింపెన యొంగిలికో, ౧౩ "అసత్కథన కాన్తారపరివర్తనపాంసులామ్ । వాచం శౌరికథాలాపగఙ్గయైవ పునీమహే" అనునట్లు భగవదేకప్రతిపాదనకథలచే శుద్ధిచేసికోవలసియుండును. ౧౪ "తిరుమాలవన్ కవియాదుకత్త్రేన్" అనునట్లు దేవతాన్తరగంధములేక శ్రియఃపతివిషయముగనే యాదినుండి యంతమువఱకును నాళ్వార్లు పాడించియున్నందున నట్టి మాలిన్యలేశములేక సర్వోత్కృష్టముగ ద్రావిడవేదములు విలసిల్లుచున్నవి. ౧౫ "వేదేషు పౌరుషం సూక్తం ధర్మశాస్త్రేషు మానవమ్ । భారతే భగవద్గీతా పురాణేషు చ వైష్ణవమ్" వేదములలో పురుషసూక్తంబును, ధర్మశాస్త్రములలో మనుధర్మశాస్త్రంబును, భారతమునందు భగవద్గీతయు, పురాణములలో శ్రీవిష్ణుపురాణంబును నెట్లు సారవంతములో, అట్లు ఈనాలుగు ప్రబంధములు తక్కినవానికంటె సారవంతములై ౧౬ "తీతిలన్దాతి" అనునట్లు కథాన్తరప్రస్తావదోషరాహిత్యముచే ఋషిప్రణీతగ్రంథములకంటె నుత్కృష్టములై విలసిల్లుచున్నవి.

---

౧॥ తిరువాయ్-౧౬-౧౧. ౨॥ తిరువాయ్-౩౫-౬. ౩॥ తిరువాయ్ ౩౫-౪. ౪॥
౫॥ తిరువాయ్-౧౪-౧౧. ౬॥ తిరువాయ్-౩ ౧౧. ౭॥ తిరువాయ్-౫౬-౧. ౮॥ తి వి-౨.
౯॥ తిరువాయ్-౧౧-౪. ౧౦॥ ౧౧॥ తిరువాయ్-౭౫-౧౧. ౧౨॥ తిరువాయ్-౫౫-౯.
౧౩॥ ౧౪॥ తి-వి-౪౮. ౧౫॥ ౧౬॥ తిరువాయ్-౬౨-౧౧.

ఇంకను, గురువైన వ్యాసులవారుచేసిన బ్రహ్మసూత్రమునకును, శిష్యులైన జైమినిచేసిన కర్మసూత్రమునకును పరస్పరవిరోధము తోఁచునట్లు, ఒకయాళ్వార్ల శ్రీసూక్తికి నింకొక యాళ్వార్ల శ్రీసూక్తి విరోధమునుగనుండుటయే లేదు. మఱియునందఱును ౧ "పేశిత్తేపేశిలల్లాల్" ఒకరుసాధించినయర్థవిశేషములను తక్కినయాళ్వార్లును తమ శ్రీసూక్తులచే దృఢపఱచుచున్నారు. ౨ "మన్వర్థవిపరీతాహియాస్స్మృతిస్సానశస్యతే" మనువిపరీతము లెట్లు త్యాజ్యములో, అట్లేయాళ్వార్లశ్రీసూక్తులకు విరుద్ధములైన స్మృతీతిహాసపురాణములు త్యాజ్యములుగనున్నవి. మనదర్శనోద్ధారకులైన యతిరాజులువారును, ఆళ్వార్ల శ్రీసూక్తులను గొనియే బ్రహ్మసూత్రభాష్యమునందుఁ బరస్పరవిరోధములనుఁబరిహరించిరి.

౩ "వేదరూపమిదంకృతమ్" ౪ "ద్రావిడీంబ్రహ్మసంహితామ్" ౫ "ద్రావిడవేదసూక్తైః" ౬ "వేతమ్తమిఴ్శెయ్తమాఱన్" అనునట్లు ద్రావిడవేదములను సంస్కృతవేదసమములుగాను తదుపబృంహణసమములుగాను చెప్పఁబడెనే? వేదములకునుండు ఉదాత్త అనుదాత్త స్వరిత ప్రచయంబులును, క్రమ జటా ఘనంబులును, ప్రశ్నాష్టకంబులును, తదుపబృంహణములకునుండు అంశ పర్వ స్కంధంబులును, పద వాక్య పాద వృత్త కాణ్డాధ్యాయంబులును నీద్రవిడవేదములకుఁ గలవా? యని యడిగినచో; వీనికినిగలవు. అవియెట్లన్న; ఎழుత్తు-(హ్రస్వదీర్ఘాత్మకములైనఅక్షరంబులు). అశై-(అవ్యయములు). శీర్-(ఆశిరియపురిచ్చీర్ మొదలగు పుష్పాదిగణములు). పన్దమ్-(బంధములు). అడి-(కుఱళడి, శిన్దడి మొదలగు ఐదుపాదవిశేషములు). తొడై-(౪౩-పాదసందర్భవిశేషములు). నిఱైనిఱై-(పేర్నిఱై మొదలగునవి). ఓశై-(శెప్పలోశై అకవలోశై మొదలగునవి). తళై-(నేరొన్ఱాశిరియ తళై మొదలగునవియేడు). ఇనమ్-(తాழிశై మొదలగు మూడుఛన్దస్సులు). యాప్పు-(ప్రబంధరూపముగానుండుట). పా-(వెణ్బా ఆశిరియప్పా మొదలగు వృత్తవిశేషములు). పణ్-(నాట మొదలగు రాగములు). ఇశై-(నిషాదాదిసప్తస్వరములు). తాళమ్-(జంపె గజకర్ణను మొదలగుతాళములు). పత్తు-(పదిపాశురములు). నూఱు-(అంశపర్వాదులవలె నూఱుపాశురములు). ఆయిరమ్-(మహాపరిచ్ఛేదములవలె వేయిపాశురములు) మొదలగుసర్వాలఙ్కారములును నీద్రవిడప్రబంధములకుఁ గలవు.

మఱియు, శ్రీమన్నారాయణుఁడు పరమపదమునందు వేంచేసియుండ వాని వాచామగోచరమైన మహిమనుసంస్కృతవేదంబులు పొగడె. వాఁడువ్యూహంబున సంకర్షణాద్యవతారంబులెత్త, ఆవేదంబులు పాఞ్చరాత్రశాస్త్రంబులైనుతించె. పిదపవాఁడు విభవంబునరామావతారంబెత్త, ౭ "వేదః ప్రాచేతసాదాసీత్ సాక్షాద్రామాయణాత్మనా" అనునట్లు శ్రీరామాయణంబైస్తుతించె. వాఁడుదివ్యతిరుపతులయందు దర్చావతారంబెత్త, ఆవేదంబులే ద్రవిడప్రబంధములై వినుతించె. ఉచ్ఛస్థలములయందుఁ బారునదికంటె తేరినమడుగులలోనుండు స్వచ్ఛమైనతీర్థమెట్లుతనలోనుండు పదార్థములను బ్రకాశింపఁజేసునో, అట్లే ఆయామతస్థులు వారివారిమతానుగుణముగ నర్థముచేసి కలుషపెట్టెడి ఉచ్ఛమైన సంస్కృతవేదములకంటె తేరినద్రవిడవేదములు నిష్కృష్టార్థములను స్పష్టముగఁ దెలియపఱచుచున్నవి. వెండియు, విరసమై-(విగతరసమై) తనయందుండు పదార్థములకుఁదప్ప ఇతరములకుఁద్రాగఁగూడనిదై పర్వకాలములయందుఁదప్ప ఇతరకాలములయందు స్పర్శయోగ్యముకాని సముద్రజలము, మేఘస్పర్శముచేత తన ఉప్పుగానుండు గుణముపోయి సకలకాలములయందు సర్వజనులకునుపభోగయోగ్యమెట్లగుచున్నదో, ఆట్లే కాలనియతియు, అధికారినియతియుఁగలిగివిరసములైన(వివిధరసములుగలవైన)

౧ తి-మా-౨౨. ౨॥ ౩॥ పాద్మ-పు. ౪॥ శఠకోపాష్టకమ్-౩.
౫॥ ౬॥ కణ్ణి-తని. ౭॥ స్కాన్ద-పు.

